# ప్రేమ కానుక



మూలం :

రవీంద్రనాథ ఠాగూరు

అనువాదం :

ఖండవిల్లి సాంబశివరావు

జయంతి పబ్లికేషన్సు,
బీసెంటురోడ్డు, విజయవాడ-2.



ఓ షాజహాన్ చక్రవర్తీ! నీ సార్వభౌమత్వం అంతరిస్తున్నా ఉపేక్షించావు! కాని ఒక ప్రేమాశ్రుకణానికి శాశ్వతత సమకూర్చ అభిలషించేవు!

గాని కాలపురుషునికి మానవ హృదయంపై రవంతయినా జాలిలేదు. సంస్కృతికోసం అనిజరిపే పెనగులాటను తిలకించి నవ్వుతూంటాడు.

అయినా నీవు సౌందర్యవాగురతో అతన్ని బందీగా చేసావు. నిరాకారమయిన మృత్యువుని, మాసిపోని సుందరకళాస్వరూపంతో కిరీటాలంకృతిని చేశావు.

మాటుమణిగిన మధుర యామినిలో ప్రేయసి వీనుల్లో పలికిన నీ ప్రణయరహస్యం శిలల శాశ్వత మౌనంలో మలచబడింది.

మహాసామ్రాజ్యాలు మట్టిలో కలసిపోయినా, అనంతయుగాలు నీడల్లో అంతరించినా, నీవు నిర్మించిన తాజ్‌మహల్లోని ప్రతి చంద్రకాంత శిలా శిరసెత్తి ఆకాశంలో మెరుస్తూన్న తారకల నవలోకించి "నేను మరచిపోలేదు, నేను మరచిపోలేదు" అంటూ గాఢనిట్టూర్పులు విగిడిస్తూనే ఉంది–

"నేను మరచిపోలేదు"——

గాని జీవిత స్రవంతి తన అనంత యాత్రా సంరంభంలో దానిని విస్మరించింది. తన మధుర స్మృతులను అనాధసుందర కళా

స్వరూపాన్ని విక్షిప్తంచేసి, మమకారపు బరువుబాధ్యతలు దిగవిడిచి నిర్విచారంగా తన అనంత ప్రయాణాన్ని కొనసాగిస్తూనేఉంది.

## 2

ఓ ప్రేయసీ! నాఉద్యానవనంలోకి విహారానికిరా. నిన్ను చూడాలని ఆసక్తితో, ఒకదాన్నిపై ఒకటిపడుతూ, బిడియంతో తీసుకుంటూ నీచూపులమీద పడుతూన్న నాఉద్యానవన విరికన్నెల ప్రక్కనుంచిరా. వస్తూవస్తూ కొన్నిటి దగ్గరయినా నిలబడి ఆనందించు. ఆ ఆనందం తాత్కాలిక మయినా అద్భుతంగా వుంటుంది.

ప్రేమయొక్క కానుక బిడియం. అదితనపేరు తానుఎన్నడూ చెప్పదు. చాటుమాటుగా సంచరిస్తూ ఎవరయినా కనబడితే మెరపుతీగలా పారిపోతుంది. పోతూపోతూ సంతోషతరంగాలతో పృథ్విని నింపుతుంది. పారిపోతూన్న దానిని వెంబడించి పట్టుకోవాలి. లేకపోతే అది నీ కెన్నటికీ దొరకదు. ఒకటి మాత్రం గుర్తుంచుకో!

గుంజుకుని బలవంతాన పుచ్చుకున్న కట్నంమాత్రం నలిపివేసిన పుష్పంలా, ఆర్పేసినదీపంలానిష్ప్రయోజనమే అవుతుంది.

## 3

నా ఉద్యానవనంలో అసంఖ్యాకంగా తీయటిపళ్ళు గుత్తులు గుత్తులుగా వ్రేలాడుతున్నాయి. అవి బాగాపెరిగి

TPLA126B101

5

రసభారంతో అలసాలసంగా సూర్యకాంతిలో ఊగుతూంటాయి

ఓ నా ప్రేయసీ! నా ఉద్యానవనంలోకి సగర్వంగావచ్చి ఆ చల్లటి చెట్లనీడలో కూర్చో. ఆరముగ్గిన పళ్ళను కోసుకో. వాటిమధురరసాల బరువుని నీపెదాలపై పూర్తిగా దించుకోనీ.

నా ఉద్యానవనంలోని సీతాకోకచిలుకలు వాటి సుందరమయిన రెక్కలను, సూర్యరశ్మిలో అందంగా విచ్చిస్తూంటాయి. చెట్ల ఆకులు చక్కగా అల్లాడుతూంటాయి. ఫలాలు పరిపక్వం పొందటానికి ఉవ్విళ్ళూరుతూంటాయి.

4

పసిరికపూవు భూతలానికి దగ్గరగా ఉన్నట్టే ఆమెకూడా నాహృదయానికి అతి సన్నిహితంగాఉంది. అలసిన అవయవాలకు మత్తునిద్రవలె, ఆమెనాకు అతి మధురమైంది. ఆమెపైనాకు గలప్రేమ, హేమంతపు నదీ ప్రవాహంలా, నిర్మలంగానూ, నిండుగానూ పరుగులు పెడుతూంది. కెరటాలతోను సుడులతోను కలసిపాడుతూన్న సెలయేటిగానంలా, నాకవిత నాఅనురాగ ప్రవంతితో ఏకమయి పాడుతోంది.

తారాగణ సమేతంగా నభోమండలం లభించినా, అనంతైశ్వర్యములతో వసుంధరామండలం ప్రాప్తించినా, నాకు కించిత్తయినా సంతృప్తిఉండదు- నాప్రేయసి నాతో కలిసిఉన్న,

పృథ్విలోకాస్త జాగా ఏమారుమూల దొరికినా చాలు. సంపూర్ణంగా తృప్తిపొందుతాను.

*5*

లోభత్వంఎరుగని ఈ వసంతదినకాంతిలో ఏశంకలూ లేక చకచకా ముందుకు సాగిపోతూన్న వారిని గురించి,— నవ్వుతూ కేరుతూ ఉత్సాహంగా పరుగులుపెడుతూ, వెను దిరిగి చూడనివారిని గురించీ,— తర్కాతీతమైన ఆనందపు వేళల్లో కలకలలాడుతూ వికసించి, మరుక్షణంలో వాడి పడి పోయినా నిర్విచారంగా ఉంటూన్న సురభిళ ప్రసూనాల గురించి,— ఓకవీ పాడుము.

నీగత జీవితపు కన్నీటిగాథల్ని, పన్నీటివలపుల్ని చెప్పటానికిం మౌనంవహించి కూర్చోకు—

రాత్రికిరాత్రి పూలనుండి విచ్చి, రాలిపోయిన పూరేకులను ఏరుతూకూర్చోకు.—

నిన్ను మోసగించి పారిపోయిన ప్రియురాలిగూర్చి వ్యర్థప్రయత్నాలు చేయకు—

జీవితంలో ఏర్పడ్డఈఖాళీలను పూడ్చకు— వాటిని అలావదలటం వల్ల వాటి అంతరాంతరాల్లోంచి అపూర్వగాన స్రవంతి పైకి ఎగచిమ్ముతుంది.

## *6*

నాకు మిగిలిన జీవితం స్వల్పాతిస్వల్పం. జీవితంలో ఎక్కువభాగం ఒక్క వసంతంలో బ్రహ్మానందంగా నిర్వ్యాజీగా గడపివేశాను నీతో – ఇప్పుడు నీకు ఒక ప్రణయగీతం రచించి పాడితే సరిపోతుంది. నీకెంగేలు మృదువుగా గ్రహించి సురభిళ ప్రసూనాలతో మాలలల్లుతేచాలు – కాంతులీనే రత్నాల కర్ణాభరణాన్నయి, ప్రియురాలి రహస్యంలా నీచెలిని నిరంతరం ఉంటేచాలు–

నీతో సాయంత్రాన ఒక్క-ఆట ధైర్యంచేసి ఆడి, అందులో ఓడిపోయి, నాసర్వస్వం పోగొట్టుకుంటేచాలు—

ఈమిగిలిన స్వల్పజీవితంలో నేనంతకంటే ఆశించను–

## *7*

నానావ అతి సున్నితమయింది, దుర్బలమయింది. ఝడివానలో బుసలుకొడుతూ మీదికెగురుతూన్న కెరటాలను దాటించ సమర్థమయిందికాదు. అయినా నీవువస్తానంటే బయలుదేరిస్తాను.

మధురస్వప్నాల అలలతో కలత నిద్రచెందిన కాటురంగు జలాలుగలతీరంవెంబడి,–వంగిన కొమ్మల్లోంచి వెలువడుతూన్న పావురాయిల కువకువ నాదాలతో విషాదభరితాలైన మిట్ట

మధ్యాహ్నపు నీడలుగల తీరంవెంబడి — నా నావను భద్రంగా నడిపించుకుని, నిన్ను తీసుకువెళతా.

సాయంకాలమున నీవు అలసిఉండగా, ప్రేలాడిఉన్న కలువ పూవు ఒకటి నీ జెడలో పెట్టడానికి కోసి తెచ్చి, తరువాత నీ దగ్గర శెలవు తీసుకుంటాను.

## 8

నా నావలో నీకు స్థలం ఉంచేను. ఒంటరిగా వరి కంకులతో నీవు ఉన్నావు. నా నావ ప్రయాణీకులతో క్రిక్కిరిసిపోయింది. చాలా బరువు సామాన్లతో నింపబడింది. అయినప్పటికీ, జాగా లేదని నిన్నెలా వదిలివేయగలను? యవ్వనంతో మిసమిసలాడుతున్న నీ కోమల శరీరం అల్లల్లాడిపోతూంది. నీ క్రీగంటి చూపుల్లో చిరునవ్వుల మెరపులు పరుగెడుతున్నాయి. నీపై వలిపము వర్షాంబుదంలా ఉంది. నా నావలో వచ్చి కూచో — ఈ నావలో ఉన్న ప్రయాణీకులు అందరూ దిగి భిన్నభిన్న మార్గాలలో ఎవరితావులకు వారు వెళ్ళిపోతారు. నువ్వు నా నావ టాపుమీద విశ్రమిస్తావు. ప్రయాణాంతమందు నిన్ను ఎవరూ వెనక్కి ఉంచరు.

నువ్వు ఎక్కడికి వెళుతున్నావనిగాని, ఎవరింటికనిగాని, ఎక్కడ ఈ వరికంకుల్ని దాస్తున్నావనిగాని నిన్ను నేను అడగను.

తెరచాపల్ని ముడిచేసి, నావకు లంగరువేసి, సాయంకాలం తీరిగ్గా కూచున్నప్పుడు మాత్రం, నువ్వు ఎక్కడికి వెళుతు

న్నావో, ఎవరింటికి వెళుతున్నావో, ఖరీకంకుల్ని ఎక్కడ దాచుకొంటున్నావో అని మనసులో అనుకుంటూ ఆశ్చర్య పరవశుణ్ణి అవుతూంటాను.

*9*

ఓ కోమలీ! నీ బుట్ట బరువుగావుంది. నీ శరీరం అలసి పోయింది. నువ్వు వెళ్ళదలచుకున్న ప్రదేశం ఎంతదూరంఉంది? ఏ ఫలాపేక్షతో వెళుతున్నావు? ఈ దారి సుదీర్ఘమైంది. మండుటెండలో నేలకాలిపోతోంది.

ఇటు కేసిచూడు! ఈ సరోవరం ఎంతో లోతుగాను, నిండుగానూ ఉంది. ఇందులోని నీళ్ళు కాకి కన్నుల్లా కాటుకరంగుగా ఉన్నాయి. నువ్వు ఇలావచ్చి ఈ సరోవరజలాల్లో అలసిన నీ చరణాలను ముంచుకో. మధ్యాహ్న జలతరంగాలమీది తేలివచ్చిన శీతల సమీరం మృదుళాంగుళతో నీ ముంగురులను సవరిస్తుంది. పావురాయిలు కువకువారావాలతో జోల పాటలు పాడుతాయి నీకు. సాంద్రతరుచ్ఛాయల్లో జరిగే ప్రణయరహస్యాలను ఆకులు మర్మరధ్వనుల్లో నీకు వినిపిస్తాయి. ఈ సమయంలో గంటలు గడిస్తేనేం? సూర్యుడు అస్తమిస్తేనేం? సాంధ్యచీకట్లలో ఈ అయోమయ ప్రదేశంలో దారి కనబడకపోతేనేం?

ఆ కనబడుతూన్నదే నా కుటీరం. ఆ పూల వెలుగుప్రక్కనే ఉంది. నేను నా వెంబడే నిన్ను తీసుకువెళతా. నీకొక చక్కటి

తల్పము అమరుస్తా. ఒక దీపం ఉంచుతా. హాయిగా నువ్వు నిద్రపో. ఉదయాన పాలుపిండుతూన్న ధ్వనులకు పక్షులులేచి కిలకిలా రావాలు చేస్తూండగా, నేను నిన్ను నిదురలేపుతాను.

## *10*

ఈ మధుపాలను స్వగృహాలనుంచి తరిమేదేమిటి? దృగ్గోచరమార్గాలను పసికట్టించి వాటిని పసుగత్తించేదేమిటి? ఆతురతతో కదులుతూన్న వాటిరెక్కలలోని ఝుంకారస్వరం ఏమిటి? పూలగుండెల్లో నిదురించే గానాన్ని అవి ఎలా వినగలుగుతున్నాయి? సిగ్గుతోను, మౌనంతోను మూలదాగున్న మకరంద శయ్యామందిరానికి మార్గం ఎలాకనుక్కున్నాయి?

## *11*

దానికి జవాబు వసంతంలో క్రొత్తచిగుళ్ళు చిగర్చటం ప్రారంభమవటమే! సముద్రం తరంగాల మీదుగా వుద్యాన వనంలోకి వసంతుడు ప్రవేశించటమే వాటికికారణం. మలయ పవనంలోని కదలికలు సందడులు, ఉండుండి చెవిపడుతూన్న చెదురు మదురు పాటలు మాత్రమే!

సరి ఈ రోజు పరిసమాప్తి అయిపోయింది.

సముద్రతరంగాలమీదుగా ఉద్యానవనంలోకి వచ్చేవసంతంలో నా ప్రణయం ఎల్లప్పుడూ పుష్పిస్తూండుగాక! నా సంతోషం ఉప్పొంగి, కరతాళధ్వనులు చేస్తూ, ఉల్లాసమయిన పాటలతో

## 11



నృత్యంచేస్తూ, ప్రభాతసుందరిని మేల్కొలిపి, ఆమెకు మధుర విస్మయం కలిగిస్తూండుగాక !

## 12

ఓ వసంతుడా ! యుగాలక్రితం నందనోద్యానపు దక్షిణద్వారం తెరచుకొని, నూత్నయవ్వనంతో ఉన్న ధాత్రీ తలానికి దిగిరాగానే, స్త్రీ పురుషులు నవ్వుతూ కేరుతూ, ఇళ్ళనుంచి బయటకు పరుగునవచ్చేసి, ఆడుతూ, పాడుతూ, ఆనందోన్మాదంతో ఒకరిపై ఒకరు పుష్పరజస్సు జల్లుకుంటూ వసంతోత్సవం జరుపుకున్నారు. ఆ తొలిచైత్రంలో దారిపొడుగునా నీవు విరజిమ్మిన ఆ పరిమళ పుష్పాలనే ఏటేటా తీసుకొనిరా.

కలలుగా మాత్రం మిగిలిన ఆ నాటి సంతోషవైభవం, కాలగర్భాన కలసికరగి పోయిన ఆ ఆనంద దినాల మాధుర్యం ఈ నాడు స్మృతికిరాగా విషాదభరితలై విరికన్నెలు తమ సువాసనలు నిట్టూరుస్తున్నాయి.

తొలి ప్రణయంలో కొట్టుకుంటూన్న నా జీవితంలోకి కొంగ్రొత్త వింతలతో నీవు ప్రకాశించావు. అప్పటినుంచీ ఆ అనుభవంలేని ఆనందంయొక్క భీరుత్వం పచ్చని నిమ్మమొగ్గలలో దాగి ప్రతి ఏటా వస్తూంది. నీ ఎర్రగులాబీలు నా హృదయాంతర్గత అవ్యక్తభావాల్ని, తమ మౌన జ్వాలలా తీసుకుపోతున్నాయి. కవితా రసాత్మకమైన ఈ మధు మాసపు

దివ్యక్షణాల స్మృతులు, నిర్విరామంగా చిగుపిస్తున్న నీ చిగురాకుల పులకింతలలో మెదుల్తున్నాయి.

# 13

గతరాత్రి వెన్నెల వాహినిలో ప్రపంచం నిద్రపోతూండగా ఉద్యానవనంలో పొంగిపోతూన్న నాయవ్వన ద్రాక్షాసవ పాత్రను నీ కందిచ్చేను. అది నువ్వందుకుని పెదాల దగ్గరుంచుకొని ఆనందాతిశయంతో రెప్పలు మూసుకొని చిరునవ్వు నవ్వేవు. ఆసమయంలో నేను, నీమేలిముసుగును మెల్లగా తొలగించి, నీ ముంగురులను సవరించి, హాసంతో మధురాతి మధురంగాఉన్న నీ ముద్దుల మోమును నా హృదయం మీదికి లాక్కొన్నాను.

ఈరోజున, మంచుతో శీతలమయిన ప్రభాత ప్రశాంతవేళ, సుస్నాతవై, మల్లెపూ వువంటి తెల్లని చీరధరించి,పూలసజ్జతో నిర్జన మార్గాన పాదచారిణివై దేవాలయానికి వెళుతూండగా, ఆ ప్రక్కనే చెట్టుక్రింద శిరస్సు వంచుకొని నేను నిలబడి ఉన్నాను.

# *14*

ఓ నా ప్రేయసీ! ఈనాడు ఆందోళన పడుతూన్నందుకు మన్నించు. తొలకరివాన కురుస్తోంది. నదీతీరానగల అడవి హర్షాతిరేకంతో గలగలారావం చేస్తోంది. విరగబూచిన కదిమి చెట్లు పోతూన్న పవనాల్ని పరిమళ మధురపాత్రల్ని అందిస్తూ ప్రలోభ పెడుతున్నాయి. అటుచూడు! ఆకాశంలో అన్ని

దిక్కులనుండీ విద్యుల్లతలు చూపు తూపుల్ని రివ్వు రివ్వున విసురుతున్నాయి. నీ శిరోజాల్లో గాలులు ఉద్ధృతంగా సంచరిస్తున్నాయి.

ఓ నా ప్రేయసీ! ఇప్పుడు ఆలస్యంగా నేను నీకు సత్కారం చేస్తూన్నందుకు మన్నించు. వర్షాలు జోరుగా కురుస్తూన్నందువల్ల దారి తెన్నులు సరిగా కనబడ లేదు. మా గ్రామంలో పని పాట్లు స్తంభించిపోయేయి. పచ్చికబయళ్ళన్నీ ధ్వంసం అయిపోయేయి. నీ కాటుక కళ్ళల్లో కురవబోయేవర్షం తన సంగీతాన్ని కనుగొంటుంది. నీ జడలోకి, మల్లెపూలను తన నీలి చీర కొంగున కట్టుకు తెచ్చి నీ గుమ్మంలో వేచిఉంది ఆషాఢ నెలతుక——

## *15*

ఆమె నల్లపిల్లని ఆ పల్లెలో ఇరుగు, పొరుగు ప్రజ అంటారు. — గాని ఆమె నా హృదయానికి మాత్రము నీలోత్పలం. - ఆమె నలుపే కావచ్చు. గాని నల్లకలువలా సుందరమయింది. పంటపొలాల్లో మొదటిసారి ఆమె నాకంట బడినప్పుడు మబ్బుల్ని కప్పుకున్న కాంతిపుంజంలా ఉంది. ఆమె శిరస్సుకు అవగుంఠనం లేక నగ్నంగా ఉంది. వదులుగా అల్లుకున్న జడ మెడపై అందంగా వేలాడుతోంది. ఆ పల్లెప్రజ అన్నట్లు ఆమె నలుపే కావచ్చు. గాని ఆమె అందమయిన నల్ల కళ్ళు నన్ను బాగా ఆకర్షించేయి. నేను ఆనందం పొందేను వాటినిచూసి——

గాలినాడి తుపానును సూచిస్తోంది. ఆమె చుక్కచుక్కల గోవు భయవిహ్వాలమై అంభారావం చేయగా ఆమె ఒక్కపరుగున కుటీరంలోంచి బయటకు వచ్చింది. ఓ క్షణం తన విశాల విసిల నేత్రాలను మబ్బులకేసి త్రిప్పి, వస్తూన్న వర్షాడంబరాన్ని, ఆకాశంలో గమనించింది – అప్పుడు వరిపొలంలో ఒక మూలను నేను నుంచున్నాను. ఆమె నాకేసి చూచినట్లయితే నేను కనబడేవాణ్ణే. అది నా ఒక్కడికే తెలుసు. మండు వేసవిలో వర్షపుజల్లుల్లోని సందేశంలా ఆమె నలుపు తప్త హృదయానికి చల్లదనాన్ని నేత్రానందాన్ని సమకూరుస్తుంది——

నిండుగాపూచిన అరణ్యసాంద్రచ్ఛాయలా పరిమళభరితమైన ఆమె నలుపు తప్తహృదయానికి చల్లదనాన్ని, నేత్రానందాన్ని, మనోరంజకతను సమకూరుస్తుంది——

వైశాఖ నిశీథిలో జాడ తెలియని ప్రేయసికోసం పరితపిస్తూన్న గాఢకాంక్షలా ఆమె నల్లగా ఉంది.

## *16*

శిథిలసోపానములుగల ఈ మడుగునానుకునే ఆమె కుటీరం ఉంది. వెదురుపొదల ఆకుల కదలికలతో కలత పెట్టబడిన చంద్రబింబాన్ని ఆ మడుగు నీట్లోచూస్తూ ఎన్నో సాయంత్రాలు ఆమె గడిపింది. వర్షదినాల్లో తడిభూమినుంచి బయల్వెడలిన దివ్యపరిమళం లేత వరిరెమ్మలమీదుగా అనేక సార్లు ఆమె దగ్గరకు వచ్చింది.

ఆమె ముద్దుపేరు, ఇచ్చటగల పోకతోపుల్లోనూ, ముంగిళ్ళ లోనూ కూచుని శీతాకాలపు రోజుల్లో కుట్టుకుంటూ, మాటామంతీ ఆడుకుంటోన్న ఆ అమ్మాయిలకే తెలుసు –

ఈ మడుగులోనే, ఆమె ఈదుతూండేది. ఈదుతూండడి ఆమె అవయవముల స్మృతులను ఆ మడుగు తన అగాధజలాల్లో నిక్షిప్తం చేసుకుంది. ఆమె తడిపాదముల జాడలు ఆ బాటలో ప్రతిరోజూ అగపడుతూంటాయి.

బిందెలు పట్టుకొని నీటికోసం వచ్చిన యువతులందరూ ఆమెను ఏవో చిన్న చిన్న పరిహాసాలాడగా, వాటికే ఆమె చిరునవ్వులు ఒలకబోయ సాగింది—

ఆ వృద్ధకర్షకుడు ఎడ్లను కడగటానికి నదికి తీసుకెళుతూ, ఆమెను పలుకరించడంకోసం ఆ గుమ్మందగ్గర ప్రతిరోజూ ఆగుతాడు—

ఈ పల్లె ప్రక్కనుంచే ఎన్నోపడవలు ప్రయాణంచేస్తూ వెళ్ళుతూంటాయి. ఎందరో ప్రయాణీకులు ఆ మఱ్ఱిక్రిందనే విశ్రమిస్తూంటారు. సంతకుపోయే జనాన్ని ఎక్కించుకొని అవతల ఒడ్డుకు ఆ పడవ చేరుస్తోంటుంది.

గాని వాళ్ళెవరూ, ఈ పల్లెబాట ప్రక్కను, శిథిలసోపానములు గల మడుగుచెంతనుఉన్న నా ప్రేయసిఉంటే కుటీరాన్ని ఎన్నడూ గమనించ లేదు.

## 17

మధుమాసపు ఉద్యానవనాల్లో మధుపాలు వదలకుండా తిరుగుతూండగా, కలువకన్నెలచూసి రేరాజు చిరునవ్వుల వెన్నెలలో చిలకరిస్తూండగా, మెరుపుతీగలు తళుకు ముద్దులను మేఘాలమీదికి విసిరి పకపక నవ్వుతూ పారిపోతూండగా, కవి శేఖరుడు వృక్షములలోను, మేఘములలోను తన్మయుడై ఒక మూలనుంచుని ఉండగానూ, – యుగాలు గడిచేయి. అతడు తన హృదయాన్ని పూవులా నిశ్శబ్దంగా ఉంచుకొని చంద్రుని మాదిరిగా స్వప్నాల్లోంచి చూసేడు. వేసవి సమీరంలా వెర్రిగా తిరుగులాడేడు —

అదిఒకానొక మధుమాసపు సాయంసమయం. సూర్యాస్తమయ అర్ణవ అగాధపు లోతులలోంచి ఓ బుడగలా చంద్రుడు ఉద యించేడు. ఒక కన్నెపడుచు మొక్కలకు నీరుపోస్తోంది. మరొకతె తన ఆడులేడికి దూర్వాంకురాలు మేతవేస్తోంది. ఇంకొకతె తన నెమిలిచేత నృత్యం చేయిస్తోంది. కవి ఉత్సాహ భరితుడై ఈ విధంగా పాడసాగాడు—

"ఓమానవులారా! జగత్తుయొక్క రహస్యాన్ని నేను వెల్లడి చేస్తున్నా వినండి! కలువకన్నె వెలవెలబోతున్న కారణం రేరాజు ప్రేమకోసమే. శతపత్రసుందరి ఉదయభానుడు అగ పడగానే తనమేలి ముసుగు ప్రక్కకు తొలగించుకుంటుంది. దానికి కారణం నేను వేరేచెప్పాలా! తొలిమల్లెల చెవిలో

చేసే మధుప ఝుంకారంలో అంతరార్థం పండితునికి అర్థం కాదుగా ? కవికి మాత్రం తెలుసు."—

ఆ మాటలువిని సూర్యుడు సిగ్గుతో కండి క్రిందకు జారి పోయాడు — చంద్రుడు సిగ్గుతో చెట్లవెనుక తారట్లాడుతూ ఉండిపోయాడు — ఈ కవి కనపడుతూన్నంత అమాయకుడు కాదుసుమా! అంటూ తామరపద్మంతో గొణుగుతున్నాడు. మలయ పవనం — కన్నెపడుచులూ, కోడెగాళ్ళూ "జగత్తు యొక్కరహస్యం బట్టబయలయింది" అంటూ ఆనందంతో చప్పట్లు చరచసాగేరు. ఒకరి కళ్ళల్లోకి ఒకళ్ళు తనవితీరా చూసుకుంటూ "మనరహస్యాల్నికూడా గాలిలో విసరేద్దాం" అంటూ సంతోషంతో పాడేరు—

## *18*

నీ హృదయం నాకు అర్పించినట్లయితే, నా జీవితం బాధ్యతల మయం అవుతుంది. నాలుగు రోడ్లకూడలి నాను కొనేఉంది నామందిరం. దాని తలుపులన్నీ తెరచేఉంటాయి. నామనస్సు మాత్రం అక్కడ ఉండదు. కారణం నేను పాడు తుంటాను.

నీ హృదయం నాకు అర్పిస్తే, నేనా విధంగా ఎందుకున్నానో సంజాయిషీ చెప్పుకోనవసరం ఉండదు. ఇప్పుడు మధుర స్వరాల్లో నీకు వాగ్దానం చేస్తున్నాను. గాని నా సంగీతం మూగవోయినట్లయితే ఆవాగ్దానాన్ని నిలబెట్టుకోటం నేను చేసే ప్రయత్నాలచూసి ఏమీ అనుకోకుండా మన్నించాలి.

వసంతంలోని ధర్మాలను, శిశిరంలో ఉల్లంఘించటం పరిపాటే కదా—

నీ హృదయం నాకు అర్పిద్దామనుకుంటే దాన్నే నిరంతరం స్మృతిపథంలో ఉంచుకోవద్దు – నీ సుందరనయనాలు ప్రణయ గానం చేస్తుండగా నీమధుర కంఠస్వరం నవ్వుల అలలతో నింపుకోగా, నువ్వడిగే ప్రశ్నలకు నేనిచ్చే జవాబులు మొరటు గాను, పెంకెగాను, వాస్తవంతో పొత్తులేనివిగానూ ఉంటాయి—అయినా వాటిని మొదట విశ్వసించి, తరువాత విస్మరించటం శ్రేయోదాయకం.

## 19

మానవుడు తన యాభయ్యో యేట సంసారాన్ని విడచి వానప్రస్థాశ్రమంస్వీకరించి అరణ్యాలకు వెళ్ళాలని పురాణాల్లో చెప్పబడింది.

ఆ అరణ్యాల్లో ఏకాంతవాసం యువకులకే అవుసరమని కవి శేఖరుడు చాటుతున్నాడు. కారణం ఏమంటే అరణ్యాలు సుందర సురభిళ ప్రసూనాలకు జన్మభూమి. వివిధపక్షి సంతతు లకు, మధుపవ్రాతాలకూ ఆటపట్టు. అచ్చటపొదరిండ్లు ప్రేమ జంటల ప్రణయ రహస్యాల పులకలకోసం నిరీక్షిస్తూంటాయి. మాలతీపూలను మనసారా ముద్దుపెట్టుకుంటూన్న అచ్చటి పండువెన్నెల్లో అగాధమైన సందేశంఉంది. గానిదాన్ని అర్థం చేసుకోగలవారు యాభైకి బాగాలోపు వయస్సుగలవారే.

19

పాపం !యవ్వనానికి అనుభవంలేదు. హఠంజాస్తి. ఒకరుచెబితే వినేదికాదు.అంచేతఆఅవకాశం యవ్వనానికేయివ్వాలి.సంసార భారాన్ని వయసుమళ్ళినవారు స్వీకరించాలి. వయసులో ఉన్న వాళ్ళు వనాలకువెళ్ళి, తరుచ్ఛాయల్లో నివసిస్తూ ప్రేమ భిక్షాటనలోని కఠిన నియమాలను అలవర్చుకోవాలి. ఇదే సరయిన పద్ధతి—

## 20

ఓనా కవితా ! నీ విలువెక్కడే ?

మలయమారుతాన్ని నశ్యంతో మలినపరచే పండితోత్తముల దగ్గరా ? చెట్టుముందా; విత్తుముందా అని నిరంతరం వ్యర్థ వాగ్యుద్ధాలు చేసుకునే తార్కికులదగ్గరా ? నిలకడలేక పరుగులుపెట్టి పోతూన్న బుద్బుద ప్రాయపు జీవితాన్ని చీవాట్లు పెట్టి కోప్పడుతూన్న పండిపోయిన ఆకుల దగ్గరా ? నాకవిత కాదుకాదు అని అరచింది.

ఓనాకవితా ! నీవిలువెక్కడే ?

తోలు దుస్తులుధరించి, పసిడి ఛాయ కలిగి దాసీలచేత దుమ్ముదులిపించుకుంటూ, ఎవరిచేతా తాకబడక, ఊరూపేరూలేని ఉత్సవవిగ్రహానికి అంకితంచేయబడ్డ అసూర్యంపశ్యలయిన పుటలతో, అల్మారాల్లో మూలుగుతున్న గ్రంథాలుగల, — ఆ భాగ్యశాలి, — అహంకారం, కండ

బలంతో అపరిమితంగా బలసి చలువరాతి ప్రాసాదాల్లోఉండే ఆ అదృష్టవంతుడు ఉండేచోటా! నా కవిత బెక్కుతూ కాదు కాదు అంది.

ఓ నా కవితా ! నీ విలువెక్కడే ?

పుస్తకాలమీద తలపెట్టుకొని. మనసెక్కడో యవ్వన మధుర స్వాప్నిక సీమల్లో విహరిస్తూండగా కూచున్నయువ విద్యార్థి దగ్గరా ? లేక వచనం వీరవిహారం చేస్తూండగా, పద్యం లోలోపలే దాగుండిపోయిన ఆస్థలంలోనా? ధూళిదూసరితమై చిందరవందరగానున్న అక్కడా నీదాగుడు మూతలు ? నా కవిత సిగ్గుపడి మౌనంగా ఊరుకుంది.

ఓ నా కవితా ! నీవిలువెక్కడే ?

ఒక్క క్షణమైనా తీరిక లేకుండాఉండే ఆనవోఘఉండే ఇంటా? తీరిక చిక్కిన క్షణంలో శయనమందిరానికె పరుగెత్తి, పసి పాపచేతిలో నలిగి, తనశిరోజాల సువాసనలతో ఘుమ ఘుమలాడుతూన్న ప్రణయ గ్రంధాన్ని దిండు క్రిందనుంచి తీసి చదువుకునే అక్కడా ? నా కవిత గాఢనిట్టూర్పువిడచి, అస్పష్టకోరికతో చలించింది.

ఓ నా కవితా! నీ విలువెక్కడే ?

ఎక్కడయితే పక్షిపాటల్లోప చిన్నస్వరంకూడా నష్టపోకుండా వినగలుగుతామో అక్కడా ? ఎక్కడయితే సేలపటి అస్పష్ట వాచాలత, పరిపూర్ణ బుద్ధివికాసాన్ని పొందుతుందో

అక్కడా? ఎక్కడయితే విశ్వవీణాతంత్రులన్నీ తమ గానామృతాన్ని విరహ హృదయాలపై వర్షిస్తాయో అక్కడా ?

"నాకవిత ఆనందంతో ఉప్పొంగి అవునవును అక్కడే"అని ఎలుగెత్తి చెప్పింది.

## *21*

(దేవేంద్రనాథ్ సేన్ బెంగాలీకి అనువాదం)

నా ప్రేయసీ ! జీవిత ఉషోదయానికిముందే మధుర స్వాప్నిక జలపాతం క్రింద నుంచుని, అందులోని దురుసుతనాన్ని నీ రక్తంలో నింపుకొంటున్నావేమో అని నేను అనుకుంటున్నాను —

నందనవనంగుండా నీవు వచ్చే సమయంలో సంతోషంతో ఉన్న మల్లెలు, మందారాలు, కలువలు, గన్నేరులు కుప్పలు కుప్పలుగా నీదోసిళ్ళలోరాలి నీ హృదయంలో జొరబడి పెంకెతనం చేస్తున్నాయేమో అని అనుకుంటున్నాను.

నీ నవ్వు–, మాటలు వినరాని రాగరాగిణిమైనపాట.

నీ నవ్వు – కంటికగపడక ఘుమఘుమలాడే దివ్యపరిమళం.

నీనవ్వు నీ హృదయాన చంద్రుడు దాగుండగా, నీ పెదాలకిటికీలోంచి ప్రసరిస్తూన్న పండువెన్నెల—

వాటికి కారణాలు ఏవని నేనడగను. తెలిసినామరచిపోతాను—

## 22

భవిష్యత్తులో ఏనాడయినా బృందావనంలో పశులకాపరి జన్మ లభిస్తుందంటే, ఈనాడు నాకుగల పదవు ప్రతిష్ఠలు, సంస్కృతీ సభ్యతలు నా స్వగృహంలోనే నేలమట్టం అవటానికి సంతోషపూర్వకంగా అంగీకరిస్తాను.

ఆ బాలగోపాలుడు వటవృక్షచ్ఛాయలో కూచుని, ఆలమందలను మేపుతూ, గుంజా పుష్పాలతో తీర్చిగా మాలలు అల్లుకుంటూ, గంభీర శీతల యమునా ప్రవాహంలోకి రివ్వున దూకుతూ, ఈదుతూంటాడు.

అతను తన సహచరులను వేకువనేపిలచి లేపుతాడు. ఆ సమయాననే ఇళ్ళు కవ్వపు సవ్వడులతో నిండిపోతాయి – ధూళిమేఘాల్ని లేపుకుంటూ పశువులు మేతకు పోతూంటాయి. గోపాంగనలు ఆవులకు పాలుతీయటానికి ముంగిళ్ళలోనికి వస్తూంటారు—

తమాల వృక్షాలక్రింద నీడలు దట్టంగా వ్యాపిస్తూండగా – నదీతీరాన్ని సంధ్యానీకట్లు అలముకుంటూండగా – దురుసైన యమునా నదిని దాటుతూ గొల్లభామలు భయకంపితలు అవు

తూండగా – బిగ్గరగా క్రేంకారవాలుచేస్తూ పురులవిప్పి మయూరాలు నాట్యంచేస్తూండగా–ఆ గోపాలబాలుకు వేసవి మబ్బుని వీక్షిస్తూంటాడు–

నవవికసిత కుసుమంలా చైత్రశీఖి ఆపాటమధురంగా ఉండగా, నెమిలిఫించాన్ని శిరసున అలంకరించుకొని, ఆ అడవిలో అతను మాయమయిపోతాడు. ఊయలత్రాళ్ళు కొమ్మల పూలతో అందంగా అల్లబడ్డాయి. మలయ మారుతం మధుర గానంతో స్పందిస్తూంది. ఆ సమయాన యమునా నదీతీరాన ఆనందంలోఉన్న ఆ పశులకాపరి బాలకులంతా జేసుతారు.

సోదరులారా ఈ నవీన వంగదేశంయొక్క నూతన యుగానికి నేను ఎన్నటికీ నాయకునుగా ఉండను. అజ్ఞానాంధకారంలో అలమటిస్తూన్న వారికి సంస్కృతీజ్ఞాన దీపికను వెలిగించడానికి నేనేమీ పాటుపడను.

నేను కాంక్షించేదల్లా ఒక్కటే. అశోక వృక్షచ్ఛాయలలో గొల్ల భామలు పెరుగు తరచుతూండే బృందావన సీమలో ఏదో ఓ పల్లెలో నేను జన్మిస్తేచాలు !

## 23

నదీ ఇసుకతీరం అంటే నాకు ప్రియం. ఒంటరిగాఉన్న అచ్చటి పడియల్లోబాతులు అరుస్తూంటాయి. తాబేళ్లు సూర్య రశ్మిలో చలికాగుతూంటాయి. సాయంత్రాన దారితప్పిన

బెస్తల చాపల డింగీలు ఏపుగా పెరిగిన రెల్లుదుబ్బులనీడల మరుగున ఆశ్రయం పొందుతూంటాయి...

నదీ అరణ్యాతీరం అంటే నీకు ప్రియం. అక్కడ వెదురుపొదల బాహుయుగ్మాల్లో నీడలు ముసురుకుంటూంటాయి. మెలికలు తిరిగిన దారిగుండా అంగనలు బిందెలు పట్టుకుని అక్కడికి వస్తారు.

ఆ నదే మనిద్దరిమధ్యా ప్రవహిస్తో ఉభయ తీరాలకు ఆపాటే సమానంగా పాడుతోంది. మీాద నక్షత్రాలు మెరుస్తూండగా చూస్తూ క్రింద ఇసుకమీాద ఒంటరిగా పడుకొని ఆపాట నేను విన్నాను. ఏటవాలుగాఉన్న ఒడ్డుఅంచున ఉషఃకాంతిలో కూచుని ఆ పాట నీవూవిన్నావు. అందులోఉన్న ఉత్తమాటలే నేను విన్నాను. అవి నీకు తెలియవు. అది నీకుచెప్పిన రహస్యం ఏమిటో ఒక విచిత్రంగానే తెలియకుండా అయిపోయింది నాకు.

## *24*

కిటికీసగం తెరచి,అవగుంఠనంసగంఎత్తుకొని,తళుకుగాజుల మూట ధరించిన గాజులవానికోసం అక్కడనిలబడి నీవు నిరీక్షిస్తూంటావు. మట్టిబాటలో కిర్రుపెడుతూ పోతూన్న బరువు బండీని, దిఙ్మండలం వెంబడే దూరానగల నదిమీాదుగా బంగురుకుపోతూన్న పడవ తెరచాప కొయ్యల్ని తీరిగ్గా పరిశీలిస్తూంటావు.

నీకు ప్రపంచం అంటే, రాట్నం ఒడుకుతూ అర్థంలేని వరుసలు పెట్టి అస్పష్టరూప కల్పనలతో ఆషామాషీగా పాడే ముసలమ్మ పాటలా ఉంది.

ఉడుకబోస్తూన్న ఈమిట్టమధ్యాహ్నం ఆ ఆగంతుకుడు బయలు దేరి వింతవస్తువులతో నిండిన బుట్టను మోసుకొని వస్తున్నాడేమో ఎవరికి తెలుసు ? అతను స్పష్టంగా కేకవేస్తూ నీ గుమ్మం ముందునుంచే వెళతాడు. వెంటనే నీవు కిటికీరెక్కలు పూర్తిగా తెరచి, మేలిముసుగుతీసి విసరివైచి. స్వప్నసాంధ్య చీకటినుంచి బయటకురా. విధివ్రాత ఎలాగుంటే అలా జరుగుతుంది.

## *25*

నీ కోమలకర పల్లవాలను నా చేతుల్లోకి తీసుకోగానే, నీ కళ్ళ నీలిలోతులలో నాహృదయం నకలువేసి, మాటల చాటున మౌనం వెనుకాడుండి తప్పించుకు పారిపోతూన్న నిన్ను వెతుకుతూంటుంది.

ఈ చంచలమైన ప్రియురాలితో తృప్తిపడాలని నాకు తెలుసు. నాలుగు రోడ్లమధ్యా ఓక్షణం కలుసుకోవటంవల్లనే ఆమె అలా వెళ్ళిపోయిఉంటుంది. ఈ లోకాల గుంపుల్లోంచి, ఈ పద్మవ్యూహాల్లోంచి, నిన్నుతీసుకుపోగల శక్తి నాదగ్గర ఉందా ? నోరుతెరుచుకుని ఉన్నమృత్యు ద్వారాలతో కూడు

కున్న అంధకార బంధురమైన దారిలో, నీ జీవితాన్ని నిలబెట్టి ఉంచగల ఆహారం నాదగ్గర ఉందా ?

## *26*

అదృష్టవశాత్తు, నా గురించి నీవు ఆలోచిస్తే, నేనుప్పొంగి నీకో పాట పాడుతాను. వర్షిస్తూన్న సాయం సుందరి తననీడలను నదిమీదవిడచి; తనమందకాంతిని ప్రతీచీ దిశకు మెల్లగా ఈడ్చుకు పోతుండగా – ఆటపాటలకు ప్రోద్దుచాలని ఆ సమయాన నీగురించి పాడుతాను సంతోషంతో —

మేడమీది వసారాలో దక్షిణాన నీవుఒంటరిగా కూచుంటావు. నేను కారుచీకట్లతో నిండిన గదిలోంచి పాడుతుంటాను. చీకటి ఎక్కువవుతూండగా, తడసిన ఆకుల సువాసన నీ కిటికీలోంచి వస్తుంది. తుపాను గాలులు కొబ్బరితోపుల్లో హోరు పెడతాయి.

ఆ సమయంలో దీపం నాగదిలోకి తీసుకురాగానే, నేను వెళ్ళిపోతాను. బహుశా అప్పుడు నిశాకాంత సలహా స్వీకరించి నాపాట వింటావేమో ! గాని అప్పుడు నేను మౌనంగా ఉంటాను.

## *27*

నా సర్వస్వం నా పళ్ళెంలో నింపి నీకు సమర్పించేను రేపు నీపాద సన్నిధికి ఏమిటి తీసుకురాగలనని ఆలోచిస్తు

## 27

న్నాను! వసంత కాలాంతాన, సుమహీనమైన మోడు శాఖలను మీదికెత్తుకొని, ఆకాశంలోకి దీనంగా చూస్తోన్న చెట్టులా నేనున్నాను.

నా లోగడ ఆరాధనలలో వేటిలోనైనా, అక్షయ అశ్రుధారల చేత వాడకుండా ఉన్న పూవు ఒక్కటీ లేదా ?

ఉన్నట్లయితే దాన్ని నా స్మృతి పథంలో ఉంచుకొని వసంత కాలాంతమున శలవు తీసుకునేందుకు నేను నీదగ్గరకువచ్చి శూన్య హస్తాలతో నుంచుండగా, నీ సుందర నయనాలతో నన్ను అభినందిస్తావా ?

## *28*

ఆమె నాశిరసు దగ్గర కూచున్నట్లు, వ్రేళ్ళతో నా జుత్తును సున్నితంగా కదుపుతూన్నట్లు, మధుర స్పర్శలతో గిలిగింతలు పెడుతూన్నట్లు నేను కల గన్నాను. ఆమె ముఖాన్ని చూసి, పెగలని మాటల అమితవ్యథచేత నా నిద్రాభంగం అయ్యేంతవరకు, నేను కన్నీటితో అలా పెనగులాడుతూనే ఉన్నాను.

నేను నిద్రలేచి కూచుని చూసేసరికి కిటికీ మీదుగా ఉన్న ఆకాశంలోని పాలవెల్లువ కాంతి జ్వాలల్లోఉన్న మౌన ప్రపంచంలా కనబడింది. ఇప్పుడు నాకు వచ్చిన కలను పోలిన కలే ఆమెకూవస్తే ఎంతబాగుండు ననుకున్నాను.

## 29

పూలవెలుగు మీదుగా మా ఇద్దరికళ్ళూ కలుసుకొన్నప్పుడు ఆమెకు ఏదో చెప్పాలని అనుకున్నాను. గాని ఆమె వెళ్ళిపోయింది. ఆమెకు చెబుదామనుకున్న మాట రాత్రింబవళ్లు గంటల కెరటాలమీద పడవలా, నా హృదయంలో అలా కొట్టుకొంటూనేఉంది. శిశిరమేఘాల్లో పయనిస్తూ ఆమె కోసం అంతులేని అన్వేషణసాగిస్తూ, నష్టపోయిన క్షణాన్ని సూర్యాస్తమయంలో వెతుక్కుంటూ, సాయం కుసుమాలలో వికసిద్దామని అభిలషిస్తూన్నట్లుగా కనబడుతూంది.

ఆమెకు నేను చెబుదామనుకున్న మాట, నిరాశా సాంధ్య చీకటిలో తన అర్థాన్ని వెతుక్కునేందుకు నా హృదయంలో మిణుకు మిణుకుమని మిణుగురులా మెరుస్తోంది.

## 30

మూగవోయిన ప్రణయ తీవ్రబాధలా, వసంత విరులు విడివడ్డాయి. వాటి ఊర్పులతో నాపాతరోజుల పాటలు కూడా జ్ఞాపకానికి వచ్చేయి. నా హృదయంలో హఠాత్తుగా కోరికలు రేకెత్తేయి. నా ప్రేయసి రాలేదుగాని ఆమె మధుర స్పర్శతో నా శరీరం నిండిపోయింది. ఆమె కంఠస్వరము పరిమళ సస్యాలమీంచి వస్తోంది. ఆమె దృష్టి వినీలాకాశపు విషాదపు లోతుల్లో ఉంది. గాని ఆమె నేత్రాలు ఎక్కడున్నాయో ? ఆమెతీపి ముద్దులు గాలిలో ఎగిరి పోతున్నాయి. గాని ఆమె పెదాలు ఎక్కడున్నాయో ?

1329

## 31

# "కదంబం"

(సత్యేంద్రనాథ్ దత్తా బెంగాలీ పాఠంనుంచి)

నా పూలు అన్నీ పాలు, తేనె, ద్రాక్షాసవంలాంటివి. వాటన్నిటినీ, పసిడివన్నె దారంతో కట్టేను. నేనెంత జాగ్రత్తగా ఉన్నా అవి నన్ను తప్పించుకుని పారిపోయాయి. దారం మాత్రం మిగిలింది.

నా పాటలు, పాలూ, తేనె, ద్రాక్షాసవంలాంటివి. నా గుండె చప్పుళ్ల లయలలో వాటిని ఆకట్టి ఉంచేను. గాని సోమరికాలం యొక్క బిడ్డలవటం చేత అవి రెక్కలు విప్పుకొని ఎగిరిపోయాయి. నా హృదయం మాత్రం నిశ్శబ్దంలో చప్పుడు చేస్తూంది.

నా ప్రేయసి సౌందర్యం పాలూ, తేనె, ద్రాక్షాసవంలాంటిది. ఆమె పెదాలు ప్రభాత గులాబీ దళాలు. ఆమె కళ్ళు తుమ్మెద నలుపు. నా హృదయాన్ని నిశ్శబ్దంగా ఉంచేను ఆమె భయపడకుండా. గాని నా పూలవలె, నా పాటవలె, ఆమెకూడా నన్ను తప్పించుకుని పారి పోయింది. నా ప్రేమ మాత్రం ఒంటరిగా మిగిలింది.

## 32

వసంతుడు మనఇంటితలుపు ఎన్నోసార్లు తట్టి పిలచేడు. అప్పుడు నేను పనిపాటుల్లో మునిగి తీయలేకపోయాను.

నీవాజవాబుకూడా ఇయ్యలేదు. ఇప్పుడు నేను ఏకాకినై విరహ బాధతో కుమిలి పోతుండగా వసంతుడు తిరిగివచ్చాడు. గాని అతనిని ఎలా పంపేయటమో తెలియటంలేదు. ఆనాడు మనకు ఆనందం సమకూర్చటానికి అతనురాగా తలుపులుమూసి తీయలేదు. కాబట్టి ఈనాడు దుఃఖాన్ని ప్రసాదించటానికి అతను రాగానే విధిగా దారిఇయ్యాలి.

## *33*

దుందుడుకు వసంతుడు ఆనాడు కలకల నవ్వుతూ నాజీవితోద్యానవనంలోకి అడుగిడి, అసంఖ్యాకమైన గులాబీలతో కాలాన్ని బరువెక్కించి, అశోక కిసలయాల కెంపుల ముద్దులతో ఆకాశాన్ని అరుణజ్వాలామయంచేశావు ఈనాడు నిర్మానుష్యమైన సందుగొందుల్లొంచి నిశ్శబ్దంతో బరువెక్కి సుదీర్ఘాలోచనలోఉన్న నీడలవెంబడి నా ఏకాంత వాసంలోకి జొరబడ్డావు. మేడమీదివసారాలో నిశ్చలంగాకూచుని, వెలవెలపోతూన్న ఆకాశవర్ణంలో, అలసి మూర్ఛపోయిన పుడమి పచ్చపైర్లను పొలాలమీదుగా చూస్తున్నావు.

## *34*

క్రిందికి దిగిన వర్షమేఘంలా, మనవీణోర్కెలు సమయం రాగానే, నీచేతికి ఎర్రని తోరంకట్టడానికి మాత్రమే వీలు చిక్కింది. నాచేతులు ఒణికేయి. ఈనాడు, ఈపచ్చగడ్డిమీద ఒంటరిగా కూచుండగా నామనస్సులో మెదిలి నన్ను ఒణి

కించే ప్రశ్న ఒకటే ఒకటి ఉంది. అది "ఆనాడు నేను నీచేతికి కట్టిన ఎర్రని తోరం. ఇప్పటికి ఉంచుకున్నావా లేదా" అని.

పూర్ణ జ్యోత్స్న అవిసె పొలాల పొలిమేర ఉన్న సన్నని బాటగుండా నీవు వెళ్ళిపోయావు. గతరాత్రి నేనిచ్చిన పూదండ నీ జడలో వేలాడు తూండగా నేను చూసేను.

నవవికసిత కుసుమాలను ఉదయాన్నే ఏరి, కడసారి కానుకగా నీకు ఇద్దామని అనుకున్నాను. గాని నువ్వెందుకు ఆగలేదు? నీజడలో వ్రేలాడుతూన్న పూదండ నీకు తెలియకుండా త్రోవలో జారిపోయి ఉంటుంది.

ఉదయ సాయంత్రాల ఎన్నో పాటలు నేను నీకు పాడేను. నీవు వెళ్ళిపోయినప్పుడు వాటిలో ఆఖరిదాన్ని నీ గొంతులో దాచుకుని మరీ వెళ్ళేవు. లోగడ ఎన్నడూ పాడని సరిక్రొత్త పాట ఒకటి పాడుతానంటే వినటానికి ఒక్క క్షణం అయినా నువ్వు నుంచోలేదు. పొలాల్లో తిరుగుతూ చెవులు గింగిర్లు పెట్టేటట్టు అవిరళంగా నా పాటను పాడుకొని వినుగుపొందేవేమో!

## 35

గతరాత్రి వర్షమేఘములు ఉరుముతూ భయపించ సాగేయి. ఝంఝా మారుతాల పిడికిలి పట్టులనుంచి తప్పించుకునేందుకు ఉసిరిక కొమ్మలు పెనగులాడుతున్నాయి. ఆప కాంత నిశీథిలో, వర్షపు హోరులో, నా ప్రేయసి కలలో కని

పిస్తుందని ఆశించేను. పొలాలమీంచి పరుగులు పెడుతూ గాలులు ఇంకా ఘోష పెడుతూనే ఉన్నాయి.

ప్రభాతసుందరి బుగ్గలు కన్నీటిచారికలతో నిండి పాలిపోయేయి. నా కలలన్నీ కరగి మాయమైపోయాయి. కఠినమైన నిజంమాత్రం నిలబడింది. కలలుకూడా వాటినైజాన్ననుసరించి నడుచుకుంటాయి.

గతరాత్రి చిమ్మచీకటి, తుపానుమైకంతో ఉంది. నిశాకాంత మేలిముసుగులా ఉన్న వర్షాన్ని తుపాను గాలులు చింపి అటూ ఇటూ విసిరిపారేస్తున్నాయి. చుక్కలు కరువైన ఆ చీకటి రాత్రిలో, హోరున కురుస్తూన్న వర్షంలో, మిథ్యాస్వరూణిగా నా ప్రేయసి నా దగ్గరకువస్తే, సత్యం అసూయ పడుతుందా?

## *36*

ఓనా సంకెలలారా? నాహృదయంలో మీరు సంగీతం పాడేరు. నేను పగలల్లా మీతో ఆడుకొని, మిమ్మల్ని నా ఆభరణాలుగా చేసుకున్నాను. ఓనా సంకెలలారా! మనం ఆప్తమిత్రులం అయేం. మీరంటే నేను భయపడ్డ రోజులుండేవి. గాని నా భయమే మిమ్మల్ని మరీమరీ ప్రేమింపచేసింది. సుదీర్ఘ గాఢాంధకార నిశలలో మీరు నాతో కలసి ఉండేవారు. ఓ సంకెలలారా! మీదగ్గర శెలవుతీసుకునే ముందు మీకు వందనంచేస్తున్నాను—

## 37

ఓనా పడవా! నీచుక్కాని అనేకసార్లు విరిగిపోయింది. నీ తెరచాపలు పీలికలు పీలికలుగా చిరిగి జీర్ణమయ్యాయి. ఇచ్చినసలహా పెడచెవినిబెట్టి లంగరు ఎత్తుకొని సముద్రంలోకి వెళ్ళిపోయేవు. ఇప్పుడు నీప్రక్కలోని బీటపెరిగిపెద్దదవుతూంది. నీలోపల బరువు మరీ అధికంగా ఉంది. వెంటనే నీప్రయాణం ఆపుచేసి, ఒడ్డుకుచేరి అలలు జోకొడుతూండగా హాయిగా నిద్రపో——

నా హెచ్చరికంతా వృథా అయిపోతుందని నాకు తెలుసు. ఈభయంకర కాళరాత్రి ముసుగుముఖం నిన్ను ప్రలోభ పెడుతూంది. తుపానులోని ఉత్తుంగ తరంగాల ఉన్మాదం నిన్ను బాగా ఆవహించింది. కడలికెరటాల సంగీతపు హోరు రెచ్చిపోతోంది. ఆ భయంకర విలయతాండవాన్ని చూసిన నీవు ఒణికిపోతున్నావు. అందుచేత ఓనా పడవా! నీగొలుసులు త్రెంచుకొని, స్వేచ్ఛపొంది, నిర్భయంగా పరుగెత్తుకువెళ్ళి, వినాశంనుండి రక్షించుకో.

## 38

చిన్నతనంలో నేను జారిపడి కొట్టుకుపోయిన ప్రవాహం అతి ఉద్ధృతమయింది. ఆసమయంలో వసంత సమీరం ఇష్టారాజ్యంగా మితిమీరి వీచసాగింది. రక్తారుణ పుష్పాలతో వృక్షాలు జ్వలిస్తున్నాయి. పక్షులు నిద్రమాని శ్రవణపేయంగా

పాడుతున్నాయి. మోహావెల్లువలో పడిన నేను కళ్ళు తిరిగేంత వడితో కొట్టుకుపోసాగేను. ప్రపంచాన్ని చూడటానికిగాని, మంచీచెడూగాని తెలుసుకునేందుకు వీలులేక పోయింది. అప్పుడు———

ఇప్పుడు యవ్వనం పొంగి పొరలుతోంది. గాని నేను ఒడ్డున కూరుకుపోయాను. సమస్త చరాచరాల గభీరగానాన్ని నేను వినగలుగుతున్నాను. వినీలాకాశం నక్షత్ర విరాజమానమైన తన హృదయాన్ని నాకోసం తెరచిఉంచింది.

## 39

నా నేత్రాంతరాల్లో, నిర్నిమేషంగా చూస్తూకూచున్న వ్యక్తి ఒకడున్నాడు. స్మృతి తీరాలకావల ఉన్న యుగాల్లోని, జగాల్లోని సమస్త విషయాలను చూసినవ్యక్తివలె అతడు కనబడుతాడు. విస్మరింపబడ్డ ఆనాటి దృశ్యాలు పచ్చిక మీద మెరుస్తూ, తలిరాకుల మీద ఒణుకుతూంటాయి.

తారకాగణాలు విహారానికి బయలుదేరే సాంధ్యసమయాల్లో, ఒకే ఒక ప్రేయసి సుందరవదనాన్ని కొంగొత్త ముసుగుల మరుగున అతడు చూస్తూంటాడు – అందుచేతనే అతని హృదయాకాశము ప్రియురాలి కలయికలు ఎడబాట్ల బాధలతో బరువుగా మూలుగుతూంటుంది. ఈ వసంత సమీరం యుగయుగాల ప్రణయ రహస్యాలతోను, కాంక్షలతోను నిండుకొని ఉంది.

## 40

మాయమైన నా యవ్వనం దగ్గరనుంచి ఈ విధంగా సందేశం వచ్చింది.

“జననమొందని వైశాఖ మాసపు ప్రకంపనలలోనూ, పాడని పాటలతో గంటలు వ్యథాభరితమవుతూన్న చోట, నేను నీ కోసం కాచుకొని ఉంటాను—వయస్సుయొక్క శిథిల పథాల మీదుగా మృత్యుద్వారాలలోంచి నా దగ్గరకు రా. ఏమంటే— కలలు కరగిపోతాయి. ఆశలు భగ్నమవుతాయి. కూడబెట్టు కున్న సంవత్సర ఫలాలు పాడయిపోతాయి-గాని నేనుమాత్రం శాశ్వత సత్యాన్ని ఒక తీరంనుంచి వేరొక తీరానికి పయనించే నీ అనంత జీవిత యాత్రలో నన్ను మళ్ళా మళ్ళా కలుసు కుంటూనే ఉంటావు...”—

## 41

ఆ పడుచులు నదిలో నీరు తేవటానికి బయలు దేరారు. వాళ్ళకలకలనవ్వులు ఆచెట్లలోంచి వినబడుతున్నాయి.వాళ్ళను ఆ దారిలో- ఎక్కడయితే మేకలు నీడల్లో తిరుగుతూ మేత మేస్తూంటాయో, - ఎక్కడయితే రాలిన ఆకులమీంచి నీడ ల్లోకి ఉడుతలు దుముకుతూ పరుగిడుతుంటాయో ఆదారిలో- వాళ్ళను కలుసుకుందామని అభిలషిస్తున్నాను.

గాని ఈనాటి నా పనిపూర్తయిపోయింది—

నాకుండలు నిండి పోయేయి—నే వెళ్ళి పోతాను – నిగనిగలాడు తూన్న పోక ఆకులలోని పసిమిని వీక్షిస్తూ, నదిలో నీరు తేటా నికి వెళుతూన్న వన్నెలాడుల కిలకిల నవ్వులు వింటూ నా గుమ్మంలో నేను నుంచుంటాను.

హిమాద్రి సుందర ప్రభాత సమయాననూ, సాయం సంధ్యా వేళలలోనూ, బరువైన నా నిండుకుండను ప్రతిరోజూ మోసుకు వెళ్ళటం అంటే నాకు ప్రీతి–

నామనస్సుకు తోచని సమయంలోదానిలోని జలం గలగలా రావం చేస్తూ, ముద్దుముద్దుగా నాతో ఏవో మాటాడేది. తీయని తలపుల నిశ్శబ్దమైన నవ్వుతో శృంకలిపి అదికూడా నవ్వుతూండేది. నేను విచారగ్రస్తుడనై ఉండగా, కన్నీరు కారుస్తూ వెక్కి వెక్కి ఏడ్చి నా హృదయంతో మాటాడేది. నేనుదానిని తుపాను రోజుల్లోకూడా – పావు రాల ఆందోళిత కూజితాలను ముంచెత్తి హోరున కురుస్తూన్న ఝుడివానలో సయితం – మోసుకు వెళ్లే వాణ్ణి—

ఈనాటి నాపని పూర్తయింది. నా కుండలు నిండిపోయేయి. పశ్చిమాన వెలుతురు క్షీణిస్తోంది. చెట్ల క్రింద నీడలు గుమి గూడుతున్నాయి. అవిసెపొలాలనుండిగాఢ నిట్టూర్పువచ్చింది. యమునాతీరానికి పోయేబాటనే నాఆశాప్రపూర్ణ నయనాలు వెంబడించి వెళుతుంటాయి—

*42*

నీవు కేవలం బొమ్మవేనా? ఆ కనబడే నక్షత్రాల్లా నిజమైన దానివిగావా? ఈ ధూళిలాకూడా నిజమైన దానివిగావా? అవి చైతన్యంతో స్పందిస్తూంటాయి. గాని ఓ రంగుల చిత్రమా! నువ్వు కదలకుండాఉండి అందరికీ ఎంతో దూరం అయిపోయేవు.

నాతో నీవు వాహ్యాళికివచ్చిన రోజున, నీశ్వాస నునువెచ్చగా ఉంది. నీ అవయవాలు జీవితాన్ని గానం చేశాయి. నా ప్రపంచం తన వచోశక్తిని నీ కంఠస్వరంలో కనుగొని, నా హృదయాన్ని నీ ముఖార విందంతో తాకింది. నువ్వు నడుస్తూ హఠాత్తుగా శాశ్వత నీడలో ఆగిపోయావు. నేను మాత్రం ఒంటరిగా నడుచుకుంటూ పోయేను.

జీవితం, పసిపాపలా, నిర్మలంగా నవ్వుతూ, మృత్యు గిలక కాయనుగలగల ఆడిస్తూ పరుగెడుతూంటుంది. రా రమ్మనినన్ను పిలుస్తోంటుంది. కనబడని దానివెంట వెళుతుంటాను.గాని నీవు మాత్రం వాహ్యాళికివచ్చి ఆనాడు ఆగిపోయిన చోటనే, ఆ ధూళి, ఆ నక్షత్రాల వెనుక అలాగే నిలబడి ఉండిపోయావు. నువ్వు కేవలం బొమ్మవి మాత్రమే.

కాదుకాదు! ఎన్నటికీ అలాకాదు! చైతన్యపు వెల్లువ నీలో పూర్తిగా ఆగిపోయినట్లయితే అది నదులలోని ప్రవాహాన్ని, శోభా ప్రపూర్ణ ఉషఃకన్య అడుగులలోని కదలికలను, ఆపి

వేస్తుంది. నీ శిరోజాలనలుపు చీకటిలోమాయమవుతే వసంతా రణ్యచ్ఛాయతన కలలతోనే అంతరిస్తుంది.

నేను నిన్ను మరచిపోయాననడం నిజమా? దారి పక్కనే ఉన్న వికసిత కుసుమాలను కూడా విస్మరించి ఏమీ వినిపించు కోక, తొందర తొందరగా ముందుకు సాగిపోయాం. నిర్ల క్ష్యంగా మనం వెళ్ళి పోతున్నా అవి తెలుసుకోలేక మన విస్మృతిలోకి తమ సువాసనలు విరజిమ్ముతూ, సంగీతంతో నింపేయి. నా జీవిత కీలకస్థానంలో ఆసీనురాల వయ్యేందుకు గాను నా ప్రపంచం నుండి నీవు దూరంగా వెళ్ళిపోయావు. కాబట్టే నాకీ నిస్మృతి కలిగింది. జ్ఞాపకశక్తి అట్టడుగుకి మునిగి పోయింది—

నా పాటలముందు ఉండడం మానేసి వాటితో కలసి ఒకటయి పోయేవు. తొలి ఉషఃకిరణంతో పాటే నా దగ్గరకు వచ్చేవు. సాయంకాలపు చివారి పసిడి కాంతితో నిన్ను పోగొట్టు కున్నాను. ఆ నాటినుంచీ అంధకారంలోనే ఎప్పుడూ నిన్ను కనుగొంటున్నాను. నువ్వు ఉత్త బొమ్మవి కావు.

## *43*

మరణిస్తూ, నీవు శాశ్వతమైన శోకాన్ని నా జీవితంలో విడచి వెళ్ళావు. నా మనోదిఙ్మండలంలోని నిర్యాణ సూర్యాస్తమయ

రంగులతో వర్ణలేపనం చేసి అందులో భూతలంనుంచి వలపుల స్వర్గానికి ఒక కన్నీటి బాట విడచి పెట్టేవు. ప్రియమైన నీ మధుర కౌగిలిలో ఉన్న నాలో, జీవన్మరణాలు దాంపత్యం పొందికతో నాలో ఐక్యం అయ్యాయి.

మేడమీది వసారాలో ఉండి, వెలుగుతూన్న దీపంతో, సమస్త చరాచరాల ఆద్యంతాలు ఎక్కడయితే కలుసుకుంటాయో ఆ ప్రదేశాన్ని చూస్తూన్న నిన్ను చూడగలుగుతున్నాననుకుంటు న్నాను. ఈ నాటినుంచీ నా ప్రపంచం నీవు తెరచిఉంచిన ద్వారాల్లోంచి వెళ్ళిపోతూంది. మృత్యుపాత్రని నీ జీవన రాగంతో నింపుతూ నాపెదాలకుఅందిస్తూ నీవు నించున్నావు ఇక్కడ—

## 44

నువ్వు మరణించింది నా బాహ్య ప్రపంచంలో మాత్రమే అనీ, – ఈ దృశ్యప్రపంచంనుంచి అదృశ్యమవటం నా దుఃఖంలో జన్మించటానికే అనీ అర్థం అవగానే, నా జీవి తానికి పరిపూర్ణత సిద్ధించినట్లూ, ప్రకృతి పురుషులిద్దరూ నాలో ఏకత్వం పొందినట్లూ అనుభూతి పొందేను.

## 45

ఓ మానినీ! నిస్సారమయిన నా జీవితంలోకి సౌంద ర్యాన్నీ, స్వస్థతనీ, నీవు జీవించిఉన్న రోజుల్లో నా ఇంటికి

తెచ్చినట్లుగానే, ఇప్పుడుకూడా తీసుకునిరా. బూజుపట్టిన గంటల పగిలిన ముక్కలను తుడిచిపారవేయి. ఉత్తవయిన బిందెలనునింపు. అశ్రద్ధని వదలిపెట్టు. తదుపరి దేవాగారపు తలుపుతెరచిదీపారాధనచేయి. ఆ దైవసాన్నిధ్యంలో మౌనంగా మనిమిద్దరం కలుసుకుందాం.

## *46*

ఆకాశము తన అనంతనీలిమనుచూసుకుంటూ, కలలు గంటూంది. మేఘాలమయిన మేము దాని చిత్త ప్రవృత్తులం. మాకు వేరే ఒక ఇల్లంటూ లేదు.

నక్షత్రాలు ఆ అనంతాకాశమకుటంలో ప్రకాశిస్తూంటాయి. వాటి చరిత్రలు స్థిరమైనవి. మావి, పెనిసిలువ్రాతల్లా మరు క్షణం చెరపవీలయినవి. జగన్నాటకంలో మాకిచ్చిన పాత్రల్లా, గాలియొక్క రంగస్థల వేదికమీదికి రావటం, మా ఉరుముల కంజరీలను మ్రోగిస్తూ, మెరపునవ్వులను ప్రసరిస్తూండడమే. గాని మానవ్వులనుంచే వర్షం వస్తుంది. అది మాత్రం యదార్థ మయింది. మా ఉరుములుమాత్రం పరిహాసాలుకావు. ఇటు వంటిమాకు జీతభత్యాలు అడగడానికి కాలంపై ఏమాత్రమూ హక్కులేదు. ఏ వాయువయితే వీచి మమ్మల్ని సృష్టించిందో ఆ వాయువే నామకరణంకూడా జరగకముందే మమ్మల్ని ఎక్కడకో ఎగరగొడుతుంది.

## 47

ఈ బాటయే నే వరించిన సహచరి. పగలల్లా నాపాదాల అడుగునఉండి నాతో అలా ముచ్చటిస్తూనే ఉంటుంది. రాత్రల్లా నా కలలకు పాటలు పాడుతూంటుంది. ఆమెతో నా కలయిక అనాది అయింది. ఆ కలుసుకోవటం ఉదయాన్నే అంతులేకుండా ప్రారంభమవుతుంది. తన వసంతాన్ని క్రొవ్విరులలోనూ కొంగ్రొత్త పాటలలోనూ తెచ్చుకుంటుంది. ఆమె ఇచ్చే ప్రతిముద్దూ, నాకు ప్రప్రథమ చుంబనంలా నిత్య నూతనంగా విలసిల్లుతుంది.

ఆ బాటా, నేనూ ప్రేమికులం. ప్రతిరాత్రీ ఆమెకోసం నా దుస్తులను మార్చుకుంటాను. పాతగిల్లి జీర్ణమయిన దుస్తుల్ని తెల్లవారుతూండగా రోడ్డుప్రక్కనున్న సత్రములలో వదలి వెళ్ళి పోతూంటాను.

## 48

పాత బాటమీదుగానే ప్రతిరోజూ పయనించేను. దాని మీంచే నాపక్వఫలాలను అంగడికితీసుకువెళ్ళేను. దానిమీంచే నా పశువులను పచ్చికబయళ్ళలోకి తోలుకెళ్ళేను. నా పడవనుకూడా మామూలు మార్గాన్నే నదిని దాటించుకువెళ్ళేను. దారులన్నీ నాకు బాగా తెలుసు.

ఒకనాటి ఉదయాన, నా బుట్టవస్తువులతో బరువుగా ఉంది. పొలాల్లో మనుష్యులు తొందర పనుల్లో మునిగిపోయారు.

పచ్చిక బయళ్ళుతో పశువుల నిండిపోయాయి. పంటధాన్యపు ఆనందంతో ధారుణీ వక్షస్సు ఊగుతోంది.

హఠాత్తుగా గాలి కంపించింది. ఆకాశం క్రిందికిదిగి నా నుదుటిని ముద్దుపెట్టుకున్నట్లయింది. మంచువీడిన ఉదయంలా నా మనస్సు వికసించి చకచక బయలుదేరింది—

పాతదారి మరచిపోయేను. కొత్తదారిలో కొద్దిపాటి అడుగులు నడవగానే, నా సుపరిచిత ప్రపంచం అంతా, మొగ్గగా ఉన్నప్పుడు మాత్రమే తెలిసిన పూవులా వింతగా గోచరించింది. నా లోకజ్ఞానం సిగ్గుపడింది. ఆ వింత గంధర్వ లోకంలో దారిగానక తిరిగేను. ఆనాటి ఉదయాన దారి తప్పటమే నా జీవితానికి అదృష్టం పట్టడం అయింది. నా శాశ్వతమయిన పసితనాన్ని కనుగొన్నాను.

## *49*

ఓ నాపాపా! స్వర్గం ఎక్కడుందని నన్నడుగుతున్నావు. మన ఋషులు అది జననమరణ సరిహద్దుల కావలఉందనీ, - దివారాత్రాల నిర్దిష్టసంచారానికి, లయలకు,కట్టుబడి కదలదనీ,- ఈ పృధ్వికి సంబంధించినదికాదనీ, చెబుతున్నారు.

ఆ స్వర్గంయొక్క ఆరని ఆకలిజ్వాల దేశకాలాలకోసమే అని, ఆ స్వర్గం ఈ మట్టిలోనే అవతరించటానికి ఇతోధికంగా ప్రయత్నిస్తూంటుందని నీ కవికి తెలుసు.

ఓ నాపాపా ! స్వర్గం నీ మధుర శరీరంలోనూ, స్పందిస్తూన్న నీ హృదయంలోనూ సఫలం అయింది.

పృథ్వీమాత పవిత్ర హస్తాలలో ఉన్న నీలోనే స్వర్గం ఉదయించిందని సంతోషంతో ఉప్పొంగి కడలి తన కెరటాల దుందుభులను మ్రోగిస్తోంది. ఆనందంతో కలకలలాడుతూన్న పూబాలలు నిన్ను ముద్దుపెట్టుకుందామనిముని వ్రేళ్ళమీద నుంచునిఉన్నాయి.

## 50

### "పా పా యి"

(దేవేంద్రలాల్ రాయ్ బెంగాలీకి అనువాదం)

"చందమామరావే! జాబిల్లిరావే! ఇలావచ్చి మా పాపాయి నుదురు ముద్దెట్టుకోవే" అంటూ పిలుస్తూ పసిపిల్లను ఒడిలో ఉంచుకొని తల్లి లాలిస్తోంది. కలలు కంటూన్న చంద్రుడు ఆ మాటలువిని మందహాసం చేస్తున్నాడు. ఆ ప్రదేశానికి వసంత యామిని అవ్యక్త పరిమళం, మామిడితోపుల నీడలపకాంత వాసంనుంచి,నిశావిహంగం పాడుతూన్న తీయని ఆ పాటలూ, చీకట్లోదాంగతనంగా వస్తున్నాయి.

దూరానగల పల్లెలో కర్షకుని పిల్లనగ్రోవినుండి విషాదస్వరాలు వెలువడుతున్నాయి — లేత వయస్సులోనున్న ఆతల్లి, డాబా

పై కూచుని బిడ్డని అడ్డాల్లో వేసుకొని "చందమామరావే! జాబిల్లిరావే! ఇలావచ్చి మాపాపాయి నుదురు ముద్దెట్టుకోవే" అంటూ తీయగా జోలపాట పాడుతోంది—

పాడుతూ పాడుతూ ఒకసారి ఆకాశానికి వెలుగైన జాబిల్లిని చూసి, వెన్వెంటనే భూమికి వెలుగైన తన పాపాయిని ఒళ్ళో చూసుకొని మురిసిపోతోంది. అదిచూచి జాబిల్లి ప్రశాంత మౌనాన్ని వహించడం ఎందుకో అని నాకు ఆశ్చర్యం కలుగుతూంటుంది. ఆపాపాయి బోసి నవ్వులు ఒలకబోసి, తల్లిని అనుకరించి "జాబిల్లిరావే!" అంటూ పిలుస్తోంది.

అదివిని ఆతల్లి సంతోష తరంగమై మందహాసం చేస్తుంది! ఆవెన్నెల రాత్రీ మందహాసం చేస్తుంది! కవిని, పాపాయి జననికి భర్తను అయిన నేను, ఎవరికీ కనబడకుండా, వెనుక నుంచి ఈ దృశ్యాన్నంతా తిలకించి పులకితుడనవుతూంటాను!

## *51*

ఈ హేమంత ప్రథమదివసం నిర్మేఘంగాఉంది. ఒడ్డు నొరసి నది నిండుగా ప్రవహిస్తూ, రేవులో పడిపోతున్న వృక్షంయొక్క బయటపడ్డ వ్రేళ్ళను కడుగుతోంది. పొడవైన సన్నని ఆపల్లె కాలిబాట, పిపాసాపీడిత నాలుకలా ఆ నది అట్టడుగు చొచ్చుకుపోయింది.

నా చుట్టూ కలయచూసేను. మౌనముద్రలో ఉన్న నీలాంబరాన్ని ప్రవహిస్తున్న నీటిని చూసేను. అప్పుడు నా హృదయం ఆనందంతో నిండిపోయింది. ఆనందమనేది, పసిపాప ముఖంలో జిలిబిలి చిరునవ్వులా నిర్మలంగా నిరాడంబరంగా బహిర్గత మయి వ్యాపిస్తుందని నేను అనుభూతి పొందేను.

## *52*

ఓర్మిలేని ఓవిరుల్లారా! వేచిఉండటంలో విసిగిపోయి శిశిరం వెళ్ళకముందే బంధాలను త్రెంచుకొని మీరు విడి వచ్చారు. కంటికి అగపడకుండా వస్తూన్న ఆ వ్యక్తి జాడలు, దారికాచి కూచున్న, మీదరిచేరగానే, ఓ వుద్యోగపుమల్లికా దామాల్లారా, పెంకె సైనికులయిన గులాబీల్లారా మీరు ముందుకురికి పరుగులు పెడుతూ, ఆయాసపడసాగేరు.

మృత్యు గంపెదగ్గరకు తరలివ మొట్టమొదటి సైన్యంమీదే. మీయొక్క రంగు, పరిమళాల కల్లోలం గాలిని బాధించేయి. మీరు నవ్వుకుంటూ, ఒకరి మీద ఒకరుపడుతూ, ఒకరినొకరు త్రోసుకుంటూ, గుండెలు విప్పుకొని కుప్పలు కుప్పలుగా పడి పోయారు.

వసంతుడు, మలయమారుతపేచికల మీద తేలియాడుతూ, నియమిత కాలానికి వస్తాడు. గాని అతడు వస్తాడన్న విశ్వాసంతో మందంగా నడచిన క్షణాలను నీవు లెక్కించలేదు. ఆపూర్ణ

విశ్వాసంయొక్క అపరిమితానందంతో నీ కాలమంతా మధ్య దారిలోనే ఇష్టంవచ్చినట్లుగా వెచ్చించావు.

అతని అడుగుల చప్పుడు దూరాన్నుంచే విని, అతను నడచి రావటానికై నీ మృత్యువసనాన్ని రివ్వున క్రిందకు విసరి పరచేవు. నీ రక్షకుడు రాకముందే నీ బంధాలు తెగిపోయాయి. అతనువచ్చి నిన్నుతనదానిగా ప్రకటించకమునుపే అతనిని నీవానిగా చేసుకున్నావు.

## *53*

## "చంపకం"

(సత్యేంద్రనాథ్ దత్తా బెంగాలీ కనువాదం)

చైత్రం గడిచి, వేసవిభూమిని ముస్గులతో కాల్చుకుతింటుండగా, నా మొగ్గను తెరచేను. ఋషీశ్వరుని ఆశ్రమంలోకి అల్లరిమారి భూతం చూస్తున్న మాదిరిగా, సగం భయంతోను సగం ఆసక్తితోను వచ్చేను.

ధ్వంసం చేయబడ్డ వనాల భయంకర రహస్యాలను నేను విన్నాను. వేసవి అలసటను తీర్చటానికై కోకిల పంచమస్వరంలో గొంతెత్తి పాడింది.నా జన్మ మందిరానికి అమర్చిన రెపరెపలాడే చిగురాకుల తెరలోంచి, భయంకరంగానూ,

విషాదభరితంగానూ, శుష్కించి నీరసంగానూ ఉన్న బయటి ప్రపంచాన్ని చూసేను.

అయినా నేను భయపడక, యవ్వన విశ్వాస బలిమితో, ధైర్యంగా బయటికి వచ్చి ఉజ్వల గగనభాండంలో ఉన్న ఘాటైన ద్రాక్షసవాన్ని కడుపునిండా తాగి, ప్రభాత సుందరికి వందనం చేసాను. నన్నే చంపక పుష్పమంటారు. సూర్యసౌరభాన్ని నా హృదయంలో ఉంచుకొని తీసుకువెళు తుంటాను.

## 54

సృష్ట్యాదిలో, పరమేశ్వరుని స్వప్నమథనంనుంచి ఇద్దరు వనితామణులు ఉద్భవించేరు. అందులో ఒక లలితాంగి స్వర్గంలో ఆ స్థాన నర్తకి, పురుషజాతిచే కోరబడే వన్నెలాడి. కిల కిల నవ్వుతూ, ఇనుప కచ్చడాల్ కట్టి కఠోర తపస్సు సలుపు తూన్న మునీశ్వరుల మనస్సులను, డాంబికులైన బుద్ధిహీనుల మనస్సులను అవలీలగా హరించి, మాఘమాసపు ఉద్ధృత గాలుల్లోనూ, వైశాఖపు ఉన్మాదపు పూతలలోనూవిత్తనాల్లా విసరివేస్తుంది.

ఆ రెండవ వనిత స్వర్గరాజ్యానికి పట్టమహిషి. శిశిరసింహాస నాన్ని అధిష్టించిన మగువ. విడివడ్డ ప్రణయహృదయాలను, కన్నీరులా మధురంగానూ, మహాసముద్రంలా ఆపాత రమణీ

యంగానూ ఉన్న చిరునవ్వుల దగ్గరకు, నూవ్వులకాలంలో చేరుస్తుంది. జీవస్మరణ పవిత్రసంగమ స్థానంలో నెలకొన్న పేరు తెలియని ప్రణయదేవాలయంలో ఆవిసిపోయిన హృదయాలనుకలుపుతుంది.

## 55

మిట్టమధ్యాహ్నపుగాలి కందిరీగ రెక్కల్లా కదులుతోంది. పల్లెలో గుడిసెల పైకప్పులు, బద్ధకంతో ఉన్న ఇళ్ళమీంచి పక్షుల్లా పడుకొని దీర్ఘంగా ఆలోచిస్తున్నాయి. చెట్లగుబుర్లలోంచి కంటికగపడకుండా కోకిల ఒకటి కమ్మగా పాడుతోంది.

ఆనవ్యగానసుధ, రాగహీనమైన మానవాళి శ్రమపై ఒలికి, ప్రియుల గుసగుసలకు, తల్లుల ముద్దులకు, పిల్లల నవ్వులను కమ్మని సంగీతాన్ని మేళవిస్తోంది. ఆ పాటలు గులకరాళ్ళపై సెలయేరులా మనతలపులమీాద ప్రవహిస్తూ మైమరచిఉన్న ప్రతిక్షణంలోనూ సౌందర్య వలయాలు ఏర్పరుస్తాయి.

## 56

ఏకాంతంగాఉన్న ఈ సాయంత్రం నేనొక పుస్తకాన్ని తీసి, హృదయం ఎండిపోయేంతవరకు చదవసాగేను. సౌందర్యం అంటే మాటల వ్యాపారస్థులు అయిన కవులు సొగసుగా చెక్కినశబ్ద చిత్రము మాత్రమే అని నాకు అర్థమయిపోయింది.

అలసిపోయిన నేను పుస్తకంమూసి, దీపం ఆర్పేస్తాను. ఒక్క-క్షణంలో జాబిల్లి వెలుగువెల్లువతో నాగదంతా నిండి పోయింది.

ఓ సౌందర్య దేవతా! ఆకాశపుటంచుల పొంగిపొరలి పోతూండే దివ్యతేజోవిరాజితమైన నీవు, చిన్న దివ్వె వెలుగు చాటున, కనబడకుండా ఎలా ఉండిపోయావు? పుస్తకంలోని నాలుగయిదు పొల్లుముక్క-లు పొగమంచులా లేచి శోభిస్తూన్న ధరిత్రీ హృదయాన్ని సైతం ప్రశాంతపరచిన ఆమె మధుర కంఠ స్వరాన్ని ఎలా వినబడకుండా చేయగలిగేయి?

## *57*

ఈ శిశిరం నా హృదయంలో ఉయ్యాలలూగింది. కాబట్టి నాదే. ఆమె కంకణాలలో మోగుతున్న చిరుగంటలు నా రక్తంలో మ్రోగేయి. ఆమె హిమావగుంఠనం నా ఊర్పులో రెపరెప కొట్టుకుంటూంది. గాలిలో ఎగురుతూన్న ఆమె ముంగురుల మధుర స్పర్శ నాళలలన్నిటిలోను పొందు తూనే ఉన్నాను. నా జీవిత స్పందనాల్లో నృత్యంచేస్తున్న చలితకిసలయాలపై ఆమె అధిష్టించింది. వినీలాకాశంలోంచి నవ్వుతూన్న ఆమెకళ్ళు, వాటి కాంతిని నానుంచే ఆస్వాదించాయి.

*58*

నక్షత్రాలు వినీలాంబరంలో గుమికూడి నవ్వుకున్నాయి. ఇసుక, మన్ను నృత్యంచేస్తూ పిల్లల్లా గిర్రున తిరుగుతున్నాయి. వాటి హాస్యధ్వానాలతో మానవుని మనస్సులో ఉత్సాహం రేకెత్తింది. ఆ నక్షత్రాలతో కలసి ఆడుకుందామని అతని ఆలోచనలు ఉవ్విళ్లూరేయి. మానవుని కలలు అగమ్యగోచరమయిన ప్రవాహంలో కొట్టుకుపోతూ, గట్టినేలను పట్టుకొని నిలబడటానికై చేతులు జాపుతాయి. ఆ ప్రయత్నాలే ఇటు కలుగాను, రాళ్ళుగాను రూపొందుతాయి. ఆ విధంగానే మానవనగరం నిర్మించబడింది.

వర్తమాన జీవిత క్షణాలనుంచి ప్రత్యుత్తరాలు కోరుతూ, గత కాలంనుంచి ఎన్నోగొంతులు ముసురుకు వచ్చేయి. వాటి రెక్కల చప్పుళ్ళు చలిస్తూన్న నీడలతో గాలిని నింపేయి. మనస్సులో నిద్రించని భావనలు, నవ్యరూప పిపాసా తీవ్రతతో చీకటి ఎడారిమీంచి ఎగిరి పోగోరి, గూళ్ళను విడిచిపెట్టాయి. అవినక్షత్రాలలో తమను కనుగొనకోరి, జ్యోతిర్మయ తీరాన్ని వెతుక్కుంటూ, దీపంలేకుండా తమస్సులో పయనిస్తూన్న యాత్రికులు - అవి కవీశ్వరుని కవితా వాగురలో చిక్కుకుంటాయి. ఊహానిర్మాణం కాని ఆ నగరంలోని దుర్గాల్లో వాటిని ఉంచుతారు. ఆయుధ పాణులై యుద్ధసన్నద్ధులవమని భవిష్యత్ సంగ్రామ రంగాలనుంచి వాటికి పిలుపువస్తుంది.

రాబోయే శాంతి సమరాలలో చేతులు కలపమని ఆజ్ఞాపించ బడతాయి.

*59*

సర్వజ్ఞులం అనుకునే ఆ సీమలో నివారుకున్న తమన్గాలను నిర్మించరు. అచ్చటరోడ్డు పక్కగా శాద్వలాలు పరచుకొని ఉన్నాయి. ఆ ప్రక్కనే పరుగులు పెడుతూన్న సెలయేటి ప్రవాహం ఉన్నది. ప్రఫుల్లరాగ ప్రసూనాలతో కలకల లాడుతోన్న కుటీర ప్రాంగణాల్లో ఝుంకారాలు చేస్తూ నిరంతరం తిరుగుతూంటాయి. ఈ సీమలో యువకులు ప్రణయ సందేశాలు అందవేయటానికి చిరునవ్వులతో బయలుదేరి, సాయం సమయాని భత్యాలు లేకుండా ఒక్కపాటతో మాత్రం ఇళ్లు చేరుకుంటారు.

మిట్టమధ్యాహ్నన మగువలు ముంగిళ్ళ చల్లటినీడలలో కూచుని, లోగాన ఏదో పాడుకుంటూ, రాట్నాలమీద దారం తీస్తూండగా, గొల్లల కాపర్ల వేణునాదం వాయుతరంగాలలో కదలుతూన్న సస్యాలమీంచి వస్తోంది. మంచి గంధపు అడవుల మెరువు నీడలలోంచి పాడుకుంటూ పోతూన్న బాటసారులు ఈ వేణునాదాన్ని విని ఆ మందానందాన్ని పొందుతూంటారు.

వణిజులు తమ సరకులతో నదికి దిగువ ప్రదేశంలోనే ప్రయాణించేస్తారు. కాని, ఈసర్వజ్ఞుల సీమలో మాత్రం లంగర్లు ఎంపి పడవలనుపంచరు. ఎగురుతూన్న జండాలతో సైనికులు ముందుకు పోతూంటారు. వాళ్ళ రాజు తన రథాన్ని ఎప్పుడూ ఆపుచేయడు. ఇచ్చటి ప్రజాసమూహాలు ఒకరినొకరు త్రోసు

కొని మీదపడుతూ రోడ్లమీద నడవరు. ఓకపీ! ఈ సీమలోనే నీగృహం నిర్మించుకో. దూరప్రయాణాల్లో నీ పాదాలకు అంటిన ధూళిని కడగివేసుకో. నీవీణాతంత్రులను శృతిచేసి పాడుకో. దినాంతమున శీతలశాద్వలంపై శుక్రనక్షత్రంక్రింద కాళ్ళుజాచుకొని ఈ సర్వజ్ఞులసీమలో హాయిగా విశ్రాంతి తీసుకో.

## *60*

ఓ అమాత్యశేఖరా! నీధనాన్ని నీవే తీసుకో. వనవాసినై, అంగనలనెరుగని ఆ మునికుమారుణ్ణి సౌందర్యపు వలలోవేసుకొనమని ఆజ్ఞచేసి పంపబడ్డ స్త్రీలలోనే నొకర్నైను. నీఆజ్ఞ ప్రకారం చేయలేక విఫలురాలనయ్యేను. ప్రభాతానఆమునికుమారుడు స్నానార్థం నదికివచ్చేడు. కపిలవర్ణంతో భాసిస్తూన్న అతని శిరోజాలు, వేకువమబ్బుల్లా అతని భుజాలపై మూగిఉన్నాయి. అతని అవయవాలన్నీ సూర్యకిరణాల్లా మెరుస్తున్నాయి. పడవనడుపుకుంటూ వెళుతూన్న మేము అతన్నిచూసి కిలకిల నవ్వుతూ పాటలుపాడేం. సంతోషావేశంతోఅందరంనదిలోకిదూకి, అతనిచుట్టూగుమిగూడినృత్యం చేయసాగేం. ఆసమయానే సూర్యుడు ఉదయిస్తూ, నీటి అంచుమీంచి ఆగ్రహ పరవశుడై చూడసాగేడు.

కుమారస్వామిలా ఆ ఋషిబాలుడు కళ్లుతెరచి, మాకదలికల సొంపును పరిశీలనగా చూసేడు. ఆశ్చర్య పరవశుడైన అతని కళ్లు వేగుచుక్కల్లా మెరిసిపోయాయి. వెంటనే రెండుచేతులు

జోడించి పైకెత్తి, మమ్మల్ని పొగడుతూ, ఒకమంత్రాన్ని, కోమలమైన తన కోకిల కంఠంతో గానంచేసాడు.

అటువంటి అపూర్వమైన పదాలతో ఏ ఐశ్వర్య భామినినీ ఎవ్వరూ ఇంతవరకు పొగడలేదు. ప్రశాంత పర్వతశ్రేణు ల్లోంచి ఉదయిస్తూన్న ఉషస్సునుద్దేశించి మౌనంగా కీర్తించే మంత్రాల్లో పదాల్లా అవి ఉన్నాయి. ఆ లతాంగులు తమ నోళ్ళను కరపల్లవాలతో కప్పుకొన్నారు. కలకల నవ్వులతో వాళ్ల శరీరాలు ఊగసాగాయి. అదిచూచిన అతని ముఖంలో అనుమానరేఖలు పరుగెత్తేయి. నేను చాలానొచ్చుకొని వెంటనే అతని ప్రక్కకువచ్చి, అతని పాదాలకుఅభివందనంచేసి "ప్రభూ! నా పరిచర్య అంగీకరించండి" అన్నాను.

అక్కడనుండి అతనిని పసిరిక తీరానికి తీసుకునిపోయి, నా చీనాంబరం కొంగుతో అతనిశరీరాన్ని తుడిచి,మోకాళ్ళమీద నిలబడి నా సుదీర్ఘ శిరోజాలతో అతని పాదారవిందాల్ని పొడియారబెట్టేను.

నేనుముఖంఎత్తి, అతని సుందర నయనాల్లోకి చూసినప్పుడు, ప్రప్రథమ లలనకు ప్రపంచం ఇచ్చిన మధురమైన మొదటి ముద్దును నేను చవిచూచినట్లుగా అనుభూతి పొంది మైమర చేను. నేను నిజంగా తరించేను. నన్ను స్త్రీగా సృష్టించిన ఆ విధాతకూడా తరించేడు. ఆ ఋషికుమారుడు అప్పుడు నాతో ఇలా అన్నాడు "నాకు తెలియని ఏ దేముడివినీవు,

'నీస్పర్శ దేవతల దివ్యస్పర్శలాఉంది. నీకళ్ళు నిశీథిలోని విచిత్రాలతో నిండి ఉన్నాయి."---

ఓ అమాత్యశేఖరా! కాదుకాదు! అది నువ్వనుకుంటూన్న నవ్వువంటిదికాదు!! ఓ వయోవృద్ధుడా! నీ ఐహికజ్ఞానధూళి, నీ పారమార్థిక దృష్టిని కప్పివేసింది. కాని ఆబుుషిబాలుని అమాయకత్వం మంచుతెరలను చీల్చికొని స్త్రీ దేవతని, ఉజ్వలసత్వాన్ని దర్శించింది. నాలోఉన్న దేవతాస్వరూపం శక్తి స్వరూపం అతని ప్రథమ ఆరాధనలోని ఉజ్వల కాంతితో మేల్కొన్నది. నా నేత్రాల్లో ఆనందభాష్పాలు నిండేయి. ఉదయకిరణం నా శిరోజాలను నాసోదరిలా నిమిరింది. అడవిగాలులు పూలని ముద్దుపెట్టుకున్నట్లుగా, నాకపోలాన్ని ముద్దుపెట్టుకున్నాయి---

ఆ కాంతలందరూ చప్పట్లు చరచేరు. పరిహాసంచేస్తూ నవ్వేరు. మట్టిలో ముసుగులు ఈడ్చుకుంటూ, విడినజుట్టు ముడయినా పెట్టుకోకుండా అతని మీదికి వాళ్ళు పూలను రువ్వసాగేరు. అబ్బ! ఎంతఘోరం! నానిష్కళంక సూర్యుడా! నాసిగ్గు తన ఉగ్రమైన మంచుతెరను అల్లి, నిన్ను ఆ మడతలలో దాచి రక్షించుకోలేక పోయిందే! నేను అతని పాదాలపైబడి "నన్ను మన్నించండి" అంటూ వేడుకున్నాను.

దెబ్బతిన్న లేడిలా నీడలోంచి, ఎండలోంచి పరుగెత్తి పారిపోయాను. పారిపోతూ "నన్ను మన్నించండి" అంటూనే ఉన్నాను. ఆస్త్రీల అసహ్యమైన నవ్వు చటచట ధ్వనులతోడి

అగ్నిజ్వాలలా నన్ను వెంటాడి వేధించసాగింది. గాని "నాకు తెలియని ఏ దేముడివి నీవు" అన్న అతని అమృతవాక్కులే నాకర్ణపుటాల్లో నిరంతరం ధ్వనిస్తున్నాయి.

—o—



# రవీంద్ర సాహిత్యం

| | | |
|---|---|---|
| గోరా | ... | 7_50 |
| త్యాగఫలము | ... | 5_00 |
| పడవమునక | ... | 5_00 |
| చోఖేర్ బాలి | ... | 5_00 |
| ఇంటా - బయట | ... | 4_50 |
| ఆదర్శ ప్రేమ | ... | 5_00 |
| రవీంద్ర నాటకావళి | ... | 5_00 |
| జీవితస్మృతులు | ... | 3_75 |
| సాధన | ... | 2_00 |
| గీతాంజలి | ... | 2_00 |
| అరూప రత్నం | ... | 1_75 |
| ఉత్తమ ఇల్లాలు | ... | 1_50 |
| హిరణ్మయి | ... | 1_50 |
| వందిని | ... | 1_50 |
| ముక్త ధార | ... | 1_50 |
| నటీర్ పూజ | ... | 1_50 |
| సన్యాసి | ... | 1_50 |
| పోస్టాఫీసు | ... | 1_00 |
| మాలిని | ... | 1_00 |
| బలిదానము | ... | 1_00 |
| రాజు - రాణి | ... | 1_00 |
| రవి కిరణాలు | ... | 1_50 |
| నా జన్మ భూమి | ... | 1_50 |
| ప్రేమకానుక | ... | 1_50 |
| లేబరేటరి | ... | 1_50 |
| రవీంద్ర దర్శనం | ... | 1_50 |
| పసి పాపల దరహాసం | ... | 1_50 |





ప్రతులకు

**జయంతి పబ్లికేషన్సు**

బీసెంట్ రోడ్డు :: విజయవాడ - 2



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B101 |
| పుస్తకం పేరు | ప్రేమకామక |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | YES |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | C.I 56 BC |
| లేని పేజీలు | |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Uma |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | Good |